# ఇంకా చెప్పు



క్రాస్‌బీ

“నాకొక చోటు తెలుసు,”
టిమ్‌తో ఆండ్రూ చెప్పాడు,
“నేను చెప్పింది
నమ్ముతావా?”





“నీ మాటలు నమ్ముతాను,” టిమ్ అన్నాడు,
“చెప్పింది నమ్ముతాను,
ఇంకా చెప్పు.”

“నాకు ఒక చోటు తెలుసు,” ఆండ్రూ అన్నాడు,
“అక్కడ నా చేతుల్లో
ఒక ఏనుగుని పట్టుకుంటాను.”





“తొండంతో సహా మొత్తం ఏనుగుని?”
టిమ్ అడిగాడు.
“అవును, తొండంతో సహా,”
చెప్పాడు ఆండ్రూ.

“ఒక చేతిలో ఒక ఒంటెను పట్టుకుంటాను. రెండు చేతులు ఉపయోగిస్తే రెండింటిని పట్టుకుంటాను. బహుశా, మూడు కూడా పట్టుకోగలనేమో.”



“రెండు చేతుల్లో మూడు ఒంటెలా?” టిమ్ అడిగాడు.

“అవును, నిజంగా,” ఆండ్రూ బదులిచ్చాడు.

“ఇంకా చెప్పు,” అన్నాడు టిమ్.



“ఆ చోటులో సింహాన్ని బుజ్జగించవచ్చు,”
చెప్పాడు ఆండ్రూ.
“దాని ముక్కు మీదా?” అడిగాడు టిమ్.



“అవును, దాని ముక్కు మీదే,” చెప్పాడు ఆండ్రూ,
“కావాలంటే, దాని చెవి కూడా మెలిపెట్ట వచ్చు.”

“అది నిన్ను కరవదా?” టిమ్ అడిగాడు.

“లేదు, లేదు,” చెప్పాడు ఆండ్రూ,
“అది నన్నెప్పుడూ కరవదు.”
“ఇంకా చెప్పు,” అన్నాడు టిమ్.





“ఆ చోటులో సముద్రపు సీల్‌కి గలిగింతలు
పెట్టగలను,” ఆండ్రూ చెప్పాడు.
“కావాలంటే దానిని మా ఇంటికి తీసుకెళ్లగలను,
మా నాన్న కుర్చీలో పెట్టగలను.”
“మీ నాన్న ఒడిలో కూడానా?” టిమ్ అడిగాడు.
“పెట్టొచ్చేమో,” ఆండ్రూ చెప్పాడు.
“ఇంకా చెప్పు,” అన్నాడు టిమ్.





“ఆ చోటులో,” ఆండ్రూ చెప్పాడు,

“నేను చెట్టు కంటే ఎత్తుగా,

ఓడ కంటే పెద్దగా,

ఎలుగు కంటే లావుగా

అవ్వగలను.”

“తిమింగలం కంటే లావుగా కూడా

అవ్వగలవా?” అడిగాడు టిమ్.

“ఆ చోటులో అవ్వగలను,” చెప్పాడు ఆండ్రూ.

“నాకు ఇంకా చెప్పు,” అన్నాడు టిమ్.



"ఆ చోటులో," చెప్పాడు ఆండ్రూ,
"నేను ఒక నదిని ఎత్తగలను,
కానీ కొంచెం కూడా తడవను."
"ఆ నదిలో చేపలు ఉన్నాయా?"
అడిగాడు టిమ్.



"ఉండొచ్చు," ఆండ్రూ చెప్పాడు.
"నదిలో ఒక పడవ,
పడవలో ఒక మనిషి,
అలల మీద ఒక సముద్రపు కాకి
కూడా ఉండవచ్చు."
"నాకు ఇంకా చెప్పు," అడిగాడు టిమ్.





"ఆ చోటులో," చెప్పాడు ఆండ్రూ,

"పెద్ద గుట్టలు, చెట్లు.

గరిటెలు, అరిటెలు,

రాజులు, గాజులు,

మేజోళ్లు, కోళ్లు,

మెట్లు, గట్లు,

కార్లు, పుకార్లు,

కత్తులు, కలాలు,

పందులు, కందులు,

ఉంగరాలు, బొంగరాలు,

ఇంకా గుంపులు, గుంపులుగా

అన్ని రకాల కుక్కలు ఉంటాయి."



"అక్కడ నక్షత్రం ఉందా?" అడిగాడు టిమ్.

"చుక్కలు నిండిన ఆకాశం ఉంది అక్కడ," చెప్పాడు ఆండ్రూ.

"ఇంద్రధనస్సు కూడా ఉందా?" అడిగాడు టిమ్.

"ఆ, ఇంద్ర ధనస్సు కూడా ఉంది," చెప్పాడు ఆండ్రూ.

"అక్కడ అన్నీ ఉన్నాయా?"
టిమ్ అడిగాడు.
"ఆ, అన్నీ ఉన్నాయి," చెప్పాడు ఆండ్రూ.
"ఒక చేతిలో ఒంటె,
ఇంకా అన్నీ ఉన్నాయా?"
టిమ్ అడిగాడు.
"అవును, అవును," అన్నాడు ఆండ్రూ.
"నేను నమ్మను,"
టిమ్ అన్నాడు.
"కానీ, ఇది నిజం,"
చెప్పాడు ఆండ్రూ.

“నీ రెండు కళ్లతో
నిజంగా చూశావా?” అడిగాడు టిమ్.

“అవును, నా రెండు కళ్లతో చూశాను,”
చెప్పాడు ఆండ్రూ.

“ఎక్కడ?” అడిగాడు టిమ్.

ఆండ్రూ అన్నాడు, “నేను చెప్పను, చెప్పినా
నువ్వు నమ్మవు.”

“నేను నమ్ముతాను,” చెప్పాడు టిమ్.
“నేను నమ్ముతానో లేదో చెప్పి చూడు.”

“నేను చెప్పను,” అన్నాడు ఆండ్రూ, “నిన్ను ఆ
చోటుకి తీసుకెళతాను.”








ఆండ్రూ వెనకే వెళ్లాడు టిమ్.

మలుపు తిరిగారు,

రోడ్డు దాటారు,

కొట్టు ముందు నుంచి వెళ్లారు,

మెట్లు ఎక్కారు,

తలుపు తెరిచి, లోపలికి వెళ్లారు.

ఒక పెద్ద గదిలోకి వాళ్లు వెళ్లారు.

నిశ్శబ్దంగా ఉన్న పెద్ద గది.

దాని గోడలకి కింద నుంచి పైదాకా

పుస్తకాల వరసలు ఉన్నాయి.

“ఇదేనా ఆ చోటు?” టిమ్ అడిగాడు.

“ఇదే ఆ చోటు,” ఆండ్రూ చెప్పాడు.

“ఒంటె ఎక్కడ ఉంది?” టిమ్ అడిగాడు.

“ఇక్కడే ఉంది,” ఆండ్రూ బదులిచ్చాడు.

“దానిని వెతికి పట్టుకుంటాను,” అన్నాడు

టిమ్.





కానీ అది అలమరాలలో లేదు.

సొరుగులలో లేదు.

సిరా బుడ్డిలో లేదు.

నేల మీద లేదు.

బల్ల మీద ఉందా?

బల్ల కింద ఏమైనా ఉందా?

తలుపు వెనక ఉందా?

మలుపులో ఉందా?

ఎక్కడా లేదు.

గదంతా కలయజూసి టిమ్ అరిచాడు,

"నాకు తెలుసు."

"ష్...ష్...ష్..." అన్నాడు ఆండ్రూ.

"ఒంటె ఎక్కడ ఉందో నాకు తెలిసింది,"

టిమ్ గుసగుసగా చెప్పాడు.

"నాకు చూపించు," అన్నాడు ఆండ్రూ.

టిమ్ బయటకు వెళ్లాడు.

ఆండ్రూ వేచి ఉన్నాడు.



మరుక్షణంలో టిమ్ తిరిగి వచ్చాడు.
టిమ్ తిరిగి వచ్చి ఆండ్రూ చేతిలో ఒక
ఒంటెను పెట్టాడు.
“చూశావా?” అన్నాడు టిమ్.
“ఒంటెను వెతికి పట్టుకుంటానని
చెప్పాను కదా.
ఈ పుస్తకంలో నాకు
ఒంటె దొరికింది.
ఒంటె ఉన్న చోటు ఇదే.”



టిమ్‌కి పుస్తకాన్ని తిరిగి ఇచ్చాడు ఆండ్రూ.
అది చాలా పెద్ద పుస్తకం.
ఆ పుస్తకంలో ఒంటెల బొమ్మలు ఉన్నాయి. ఒంటెల కథలు కూడా ఉన్నాయి.
"చూడు," అన్నాడు టిమ్, "నా చేతిలో చాలా ఒంటెలను పట్టుకున్నాను."



"నేను అదే చెప్పాను కదా?" అన్నాడు ఆండ్రూ.

“నేను ఇంటికి ఒక రాకెట్టుని,
జెసిబిని, ఒక జిరాఫీని తీసుకుని
వెళదామనుకుంటున్నాను,” టిమ్ అన్నాడు.
టిమ్ ఒక పుస్తకం తీసుకున్నాడు,
మరొక పుస్తకం తీసుకున్నాడు,
ఇంకొక పుస్తకం తీసుకున్నాడు.
ఇంటికి వెళ్లటానికి అతడు సిద్ధంగా ఉన్నాడు.

“కాసేపు ఆగు. నేను కూడా ఒక
పుస్తకం తీసుకుంటాను,” అన్నాడు
ఆండ్రూ.





ఆండ్రూ కోసం టిమ్ ఆగాడు.
తరవాత ఇద్దరూ కలిసి ఇంటికి
బయలుదేరారు.
తలుపు తీసుకుని బయటకు
వచ్చారు,
మెట్లు దిగారు,
కొట్టు ముందునుంచి వెళ్లారు,

రోడ్డు దాటారు,
మలుపు తిరిగారు.

ఒక రాకెట్టు,
ఒక జెసిబి,
ఒక జిరాఫీతో టిమ్.

చంకలో ఏనుగుతో
ఆండ్రూ.





“జాగ్రత్త,” అన్నాడు టిమ్,
“లేదంటే నా జిరాఫీ బయటకు వచ్చి
ఇక్కడినుంచి గుట్ట వరకు కార్లను అన్నింటిని
ఆపేస్తుంది. ఒకదాని వెనక ఒకటి కార్లు అన్నీ
ఆగిపోతాయి. అప్పుడు ఇంటికి వెళ్లటానికి
మనకు చాలా సమయం పడుతుంది.”

“ఏం పర్వా లేదు,” అన్నాడు ఆండ్రూ.
“ఏనుగు మనకి సహాయం చేస్తుంది.
అది చాలా పెద్దది, ఎంతో బలమైనది.
బాగుంటుంది దానిపై సవారి.”

“ఒక రాకెట్టుని, జెసిబిని, నన్ను అది
మోయగలుగుతుందా?” అడిగాడు టిమ్.
“తప్పకుండా,” చెప్పాడు ఆండ్రూ,
“వీటన్నింటితోపాటు ఒక జిరాఫీని కూడా అది
మోయగలదు.”



"లేదంటే నేను రాకెట్టు ఎక్కి నేరుగా
ఇంటివరకు ఎగరగలను.
ఇంటివెనక పెరడులో దిగగలను.
హా! అమ్మ ఎంత కంగారు పడిపోతుంది!
'టిమోతీ, నీ రాకెట్టు నా తోటనంతా
పాడుచేసింది. దానిని వెంటనే ఇక్కడ నుంచి
తీసెయ్యి. చెప్పింది వినపడిందా, టిమోతీ?'
అని అమ్మ తప్పకుండా అంటుంది,"
చెప్పాడు టిమ్.





“ఏనుగు ఎక్కి నేను ఇంటికి వెళితే,
‘మనందరికీ, ఈ ఏనుగుకీ
సరిపోయేటంత పెద్దది కాదు
మన ఇల్లు.
దీనిని ఉంచాలి బయటే, ఇంటి బయటే.
నడువు, ఏనుగుని తీసుకుని బయటకు
నడువు!’ అంటుంది అమ్మ.
అప్పుడు నేనేం చెయ్యాలి?”
అడిగాడు ఆండ్రూ.

“మన రెండు ఇళ్ల పెరడుల మధ్య
మనం ఒక దడి కడదాం,” టిమ్
చెప్పాడు. “దానికి ఒక వైపు మీ
ఇల్లు, మరొక వైపు మా ఇల్లు.”





“తరవాత జెసిబితో

ఏనుగుని,

రాకెట్టుని,

జిరాఫీని ఎత్తి

ఆ దడిలో ఉంచుదాం.

అప్పుడు మా అమ్మ ఏమీ అనదు,”

చెప్పాడు ఆండ్రూ.

“మా అమ్మ కూడా ఏమీ అనదు,” అన్నాడు

టిమ్.



"మనం ఇంటికి వచ్చేశాం," చెప్పాడు ఆండ్రూ.

అతడు వాళ్ల ఇంటి గేటు వద్ద ఆగాడు.

"ఇప్పుడు నమ్ముతావా?"

అడిగాడు ఆండ్రూ.

"ఏమిటి?" అన్నాడు టిమ్.

"ఏమిటో నీకు తెలుసు," చెప్పాడు ఆండ్రూ.

అతడు వాళ్ల ఇంటిలోకి వెళ్లాడు.

టిమ్ కూడా వాళ్ల ఇంటిలోకి వెళ్లాడు.

ఇంటి ముందు మెట్ల మీద
కూర్చుని ఉంది టాన్సీ.
టిమ్ చెల్లెలు టాన్సీ.
అతడు పుస్తకాలను తన వెనక
దాపెట్టి అడిగాడు.



"నా చేతుల్లో ఏముందో చెప్పుకో?"
అన్నాడు టిమ్
"జామ్‌తో బ్రెడ్ సాండ్‌విచ్,"
టాన్సీ చెప్పింది.
"కాదు, మళ్లీ ఊహించు," అన్నాడు టిమ్.
"ఒక మిడత," అంది టాన్సీ.



“నువ్వు కనుక్కోలేవు.

నా చేతిలో...

ఒక రాకెట్టు,

జెసిబి,

ఒక జిరాఫీ ఉన్నాయి,”

అన్నాడు టిమ్.

“కొయ్, కొయ్,” అంది టాన్సీ.

“ఇది నిజం,” చెప్పాడు టిమ్.





అతడు టాన్సీ పక్కన కూర్చున్నాడు.
“నాకొక చోటు తెలుసు,”
టాన్సీతో చెప్పాడు టిమ్,
“నేను చెప్పింది నమ్ముతావా?”
“నీ మాటలు నమ్ముతాను,” అంది టాన్సీ,
“చెప్పి చూడు.”
“నాకు ఒక చోటు తెలుసు, అక్కడ నా చేతుల్లో
ఒక ఏనుగుని పట్టుకుంటాను.”
“తొండంతో సహా మొత్తం ఏనుగుని?”
టాన్సీ అడిగింది.
“అవును, తొండంతో సహా,”
చెప్పాడు టిమ్.



“ఇంకా చెప్పు,” అంది టాన్సీ.



"నేను చెప్పను," టిమ్ అన్నాడు,
"చెప్పినా నువ్వు నమ్మవు."
"నేను నమ్ముతానో లేదో చెప్పి
చూడు."

"నేను చెప్పను," అన్నాడు టిమ్, "నిన్ను ఆ చోటుకి తీసుకుని వెళతాను."



అయిపోయింది